# జిడ్డు కృష్ణమూర్తి

# అనుభవ ధార



చిక్కాల కృష్ణారావు

ప్రచురణ నెం 4



సమర్పణ
నాగమణి

నిర్వహణ
స్వామి యోగానంద నిష్కల రమణమూర్తి

ప్రథమ ముద్రణ 1993

ప్రతులు 1000

ధర : రు 10-00

జిడ్డు కృష్ణమూర్తిగారి
"The Song of Life కి
స్వేచ్ఛానువాదం

ప్రతులకు
చిక్కాల కృష్ణారావు
"కృష్ణ నిలయం", గొల్లవీధి,
భీమునిపట్నం
విశాఖజిల్లా - 531 163

ముద్రణ
శ్రీ అరుణోదయ ప్రింటింగ్ ప్రెస్
సీతారామపురం, [illegible]

# ముందుమాట

సత్యాన్ని తెలుసుకోవడం అంతిమ అనుభవం

సత్యాన్ని తెలుసుకుని,
నన్ను నేను పునః సృష్టించుకున్నాను

నేను కవిని కాదు

నేను సత్యాన్ని ఏ విధంగా తెలుసుకున్నానో,
దాన్ని మాటల్లో చెప్పడానికి ప్రయత్నించాను

జిడ్డు కృష్ణమూ

# నా మాట

జీవిత తత్వసారాన్ని
అనుభవ ధూళి నుంచి అసలు సత్యాన్ని
పోగుజేసే ప్రయత్న ఫలితం, ఈ పుస్తకం

ఈ అనువాదం,
మూల గ్రంధానికి
కాంతిలేని నీడ మాదిరిగా వుండవచ్చు

పరిమితమైన నా జ్ఞానం
అవగాహనా లోపం ఇందు కనపడవచ్చు

ఈ నా ప్రయత్నంవల్ల
ఏ కొంచెమైనా సత్యం వ్యక్తమైతే
అది భగవాన్ రమణ మహర్షి
ఆశీర్వాదంగా భావిస్తాను

చిక్కాల కృష్ణారావు

# 1

ప్రపంచ వాంఛ నీ వాంఛగా
విశ్వప్రేమ నీ ప్రేమగా చేసుకో

నీ ఆలోచనల్లో ప్రపంచాన్ని నీ మనసులోకి
తీసుకుని, నీ పనులద్వారా నీ శాశ్వతత్వాన్ని
ప్రపంచం చూడనియ్యి

నీకు కావలసినంత నీరు
బావిలోంచి తోడుకోవచ్చు కాని,
నీ కోర్కెల దాహం నువ్వు తీర్చలేవు

నీ హృదయం తన ప్రేమ పుష్పాన్ని పట్టుకోవచ్చు.
కాని, మృత్యువు సమీపించేకొద్దీ
ఆ పువ్వు వాడిపోతుంది

మహోన్నతమైన సంకల్పానికి
నీ ఆలోచనలు స్వేచ్ఛగా విహరించవచ్చు
కాని ఆతృతతో కూడిన తికమకవల్ల
ఆ ఆలోచనలు బందీలౌతాయి

బలవంతుడు విడిచిన బాణంవలె
నీ సంకల్పం శాశ్వతత్వమూలాన్ని
తొందరగా తాకనియ్యి

ప్రవాహపు వడిలో కొండవాగు
పరిశుభ్రంగా వున్నట్లు
స్వేచ్ఛపైపు నీ మనసు ఆర్తితో ఎగిరిగెత్తనియ్యి
ప్రేమ హృదయం నుంచి పెల్లుకున్న
అవగాహనా వాణే నా వాణి
అది అనంత దుఃఖంలోంచి జన్మించింది

* * *

## 2

నీ హృదయం పవిత్రంగా
నీ మనసు నిర్మలంగా వుంటే
నీకు ఇతరులు చెప్పవలసిన అవసరమేముంది ?
నీ కోర్కెను తృప్తిపరిచేవారు ఎవరు ?
తృప్తిలేక దహించబడుతున్న నీ బాధను
ఎవరు నివారించగలరు ?

అవగాహన ఇవ్వబడుతుందా ?
లేక, ప్రేమ మార్గం నీకు చూపబడుతుందా ?
"మృత్యుభీతి' అనే దాన్నుంచి
నువ్వు తప్పించుకోగలవా ?

ఒంటరితనపు బాధను-
నువ్వు దూరంగా వుంచగలవా !
లేక, ఆరాటపు రొదనుంచి నువ్వు పారిపోగలవా ?

సంగీత తన్మయత్వం వెనక
నీకు నువ్వు దాక్కోగలవా ? లేక,
ఆనందపారవశ్యంలో నిన్ను నీవు మరచిపోగలవా ?

అవగాహనతో జ్ఞానోదయ మౌతుంది
ఆ జ్ఞానం కంఠమెత్తి ఎంత గట్టిగా చెప్పినా,
అది అరణ్య రోదనమే అవుతుంది

ఒకతను నక్షత్రాన్ని నీడల్ని చూసి
వాటి అందానికి కారణమేమిటో
తెలుసుకోవడానికి బయలుదేరాడు

జీవితం మరణిస్తుందా ?
నీ బారుగువాని కంటిలోకి చూడు
మేఘం కమ్మిన నీడలో లోయ మరుగున పడివుంది
కాని, అనంత ఆకాశాన్ని తదేకంగా చూస్తూ
పర్వత శిఖరం ప్రశాంతంగా వుంది

పుణ్య నదీ తీరాన యాత్రికుడొకడు
ఆపకుండా మంత్రాన్ని జపిస్తున్నాడు
చల్లని దేవాలయ ధ్యానమందిరంలో
ఒకతను మోకరిల్లి భక్తిలో లీనమైపోయాడు
కాని వేసవికాలపు దట్టమైన దుమ్ముకింద,
ఒక పుష్పం ఆకలి పడివుంది

నీ ఖైదునుంచి నిన్ను బైటికి రమ్మని,
ఎవరు పిలుస్తారు ?
నీ కళ్ళను కప్పిన బానిసత్వపు పొరను
ఎవరు చింపేస్తారు?

కొండకింద దారి నెమ్మదిగా శిఖరానికి పోతుంది
కాని, ఎవరు తమ బరువుగా నిన్ను
పర్వత శిఖరానికి మోసుకుపోతారు ?

ఒక కుంటి అతను నా వేపు రావడం చూశాను
బాధించే జ్ఞాపకంతో కన్నీరు కార్చాను

ఆకాశంలో - చాలా దూరాన ఒకే నక్షత్రం వుంది

* *

# 3

అన్నింటికీ అంతం ఆదిలోనే
అణగి, మరుగుపడి వుంది
లయబద్ధమైన సుఖ-దుఃఖాల ద్వారా
అది బహిర్గతం కావడానికి నిరీక్షిస్తుంది

ఓ ప్రియతమా,
కాల వేదనతో తగుల్కొని
ఆంతరంగిక అభివృద్ధి అణగడంచేత కుంటుపడి
తేజోవంతమైన తన్మయత్వమార్గాన్ని
అన్వేషిస్తున్న నాకు, నువ్వే సర్వం

ఓ ప్రియతమా, -
ఛందోబద్ధమైన కవితలో రూపమేర్పరచుకుని,

జీవితాన్వేషణలో ఐశ్వర్యాల్ని పోగుజేసుకుంటో
విశ్వహృదయానికి బాట వేసుకుంటున్న నాకు
నువ్వే సర్వం

ఓ ప్రియతమా
కోర్కెల రహస్య నిలయంలో
ఆవరించబడిన ప్రేమతో
శాశ్వతత్వపు గీతానికి నృత్యం చేస్తున్న నాకు
నువ్వే, సర్వం

ఓ ప్రియతమా,
జనన - మరణ వలయంలో
అనంతమైన వ్యక్తా వ్యక్తాల మధ్య
వారధి కడుతున్న నాకు, నువ్వే సర్వం

ఓ ప్రియతమా
తీవ్రమైన ఆరాధనతో తికమకపడి
వ్యర్థమైన ఆలోచనల అన్వేషణలో భ్రమపడి
పరిశుద్ధమైన దాంట్లో లీనమైపోతున్న నాకు
నువ్వే సర్వం

ఓ ప్రియతమా,
నేను ఎప్పటి మాదిరిగా
ఇప్పుడు కూడా పరిపూర్ణంగా వున్నాను

* * *

# 4

ఓ మిత్రమా
జీవిత రహస్య పరిమళం సంగతి
నేను నీకు చెపుతాను విను

జీవితానికి తత్వశాస్త్రం లేదు
కుయుక్తి ఆలోచనా పద్ధతులు లేవు

జీవితానికి మతం లేదు
గర్భాలయంలో ఆరాధనా లేదు

జీవితానికి దేవుడు లేడు
భయానకమైన పూర్మికఖారమూ లేదు

జీవితానికి ఒక నివాస స్థలం లేదు
చివరికి నశించిపోతుందనే
బాధాకరమైన దుఃఖమూ లేదు

జీవితానికి సంతోషమూలేదు, బాధాలేదు
వెంబడించే ప్రేమవల్ల అది చెడేదీకాదు

జీవితం మంచిదీకాదు, చెడ్డదీకాదు
నిర్లక్ష్య పాపానికి అది కఠిన శిక్షకాదు

జీవితం సుఖాన్ని ఇవ్వదు
'విస్మృతి''అనే గర్భాలయంలో అది విశ్రాంతి తీసుకోదు

జీవితం ఆత్మాకాదు, పదార్థమూకాదు
"కర్మ-అకర్మ" అనే క్రూరమైన విభాగం జీవితానికి లేదు

జీవితానికి మరణం లేదు
కాల ఛాయలో దానికి ఒంటరితనపు శూన్యమూ లేదు

శాశ్వతత్వంలో జీవించేవాడే స్వేచ్ఛాపరుడు
అతనికే జీవితం వుంది

* * *

# 5

వెయ్యి కళ్ళతో వెయ్యి దృక్పథాలతో,
వెయ్యి హృదయాలతో వెయ్యి ప్రేమలతో
నేను వున్నాను

పరిశుభ్రమైన, కల్మషమైన నదులను
లక్ష్యపెట్టకుండా శీఘ్రమకునే సముద్రం మాదిరిగా
నేను వున్నాను.

పర్వతాల మధ్య వరన్ను లోతుగా వుంటుంది
ఊటుపోటు తేటగా వుంటుంది
నిగూఢంగా దాగివున్న అన్నింటి మూలమే, నా ప్రేమ

వచ్చి ఆ నా ప్రేమను రుచి చూడు
చల్లని సంధ్యవేళలో పద్మం వికసించునట్లు,
అప్పుడు నీ హృదయం
తన రహస్య వాంఛను కనుక్కుంటుంది

రాత్రి గాలిని మల్లెల పరిమళం నింపుతుంది
దట్టమైన అడవిలోంచి
గడచిపోతున్న రోజు పిలుపు వినవస్తుంది

సంపూర్ణ స్వేచ్ఛను పొందిన నా ప్రేమజీవనం
భార రహితంగా వుంది

* * *

## 6

ప్రేమే, దైవం
కుటిలమైన మనసువల్ల
అలసిన భారాన్ని పక్కన పెట్టి,
నువ్వా ప్రేమను అనుసరించినట్లయితే,
ప్రేమ వ్యాకులతలవల్ల సంభవించే
భయాల నుంచి నువ్వు స్వేచ్ఛ పడతావు

కాల-దూరాలతో,
మనసుకు చెందిన ఆనంద రహిత విషయాలతో,
ప్రేమ పరిచ్ఛిన్నితంకాదు

ప్రేమాన్వేషణా తికమకల్లో
పూర్తిగా నిమగ్నమై తిరిగేవాని హృదయంలో
ఆ ప్రేమ ఆనందాన్ని పొందుతుంది

అన్నింటిలో నిగూఢంగా దాగివున్న సౌందర్యమే,
దివ్యత్వం
అది ప్రేమయొక్క అమరత్వం

ఓ మిత్రమా,
నువ్వు ఇంకా, ఇంకా ఎందుకు అన్వేషిస్తావు?
అలక్ష్యపు ప్రేమ ధూళిలో,
అనంత జీవన యాత్ర వుంది

* * *

# 7

జీవితాన్ని ప్రేమించు
జీవితం ఎప్పుడు ఆరంభమౌతుందో
అటు ఆదికి గాని, ఇటు అంతానికి గాని తెలియదు
జీవితానికి ఆది - అంతాలు లేవు
జీవితమే వుంది

జీవన సాఫల్యంలో మృత్యువుకాని,
భయంకరమైన ఒంటరితనపు బాధకాని లేవు
జీవితం - తాను సాఫల్యం పొందె మార్గంతో
మృదు భాషణ, దిక్కుమాలిన అరుపు,
చిరునవ్వు, విచారకర విలాపం - ఇన్ని వున్నాయి

నీ పొరుగు వాని కంటిలోకి చూసి,
ఆ అవగాహనతో నిన్ను నీవు చూసుకో!
ఆ అవగాహనలో ఎప్పుడూ మార్పుచెందని
అమృతత్వం - శాశ్వత జీవనం వుంది

జీవితాన్ని ప్రేమించని వానికి
సంశయ జనిత వ్యాకుల భారం,
ఒంటరితనపు భయం వుంటాయి
వానికి మిగిలేది మృత్యువు ఒక్కటే

జీవితాన్ని ప్రేమించు
ప్రేమజీవనం అవినీతిని ఎరుగదు
జీవితాన్ని ప్రేమించు
నీ వివేకమే నిన్ను ఉన్నతుణ్ణి చేస్తుంది
జీవితాన్ని ప్రేమించావా
జ్ఞాన మార్గం వదలి
మవ్వుదూరాలు తిరగనవసరంలేదు

భూమిని ముక్కలు, ముక్కలుగా విభజించినట్లు,
మానవుడు జీవితాన్ని విభాగంచేసి
దుఃఖాన్ని తెచ్చిపెట్టు కుంటాడు

పూలతో, పరిమళధూప దీపాలతో,
పురాతన దేవతలను పూజించవద్దు
గొప్ప సంతోషంతో జీవితాన్ని ప్రేమించు
ఆనందపారవశ్యంతో గట్టిగా పాడుకో!
జీవన నృత్యంలో బంధాలు లేవు

అమృతత్వమైన, స్వేచ్ఛాయుతమైన,
శాశ్వత మూలాధారమైన జీవితానికి
చెందినవాడను నేను
ఆ జీవితం గురించే నేను పాడతాను

* * *

# 8

ఒకే హృదయ పరిమళాన్ని వెదకవద్దు
దాని సుఖ లాలసత్వంలో నివసించవద్దు
దాంట్లో ఒంటరితనపు భయం వుంటుంది

సామాన్యమైన ప్రేమ ఒంటరితనాన్ని చూసి
నేను విలపించాను

నాట్యమాడుతున్న నీడల్లో,
వాడిన పువ్వు పడివుంది

ఏకత్వంలో భిన్నత్వాన్ని ఆరాధించడం
దుఃఖదాయకం
భిన్నత్వంలో ఏకత్వాన్ని ప్రేమించడం
శాశ్వతానందం

* *

# 9

వీచే గాలివల్ల నిర్మల తటాకం
ఎంత తేలికగా కలత చెందుతుంది !

ఓ మిత్రమా, చంచలమైన దాంట్లో
ఆనందాన్ని అన్వేషించకు

ఆనందానికి ఒకటే మార్గం వుంది
అది నీ హృదయం ద్వారానే
అది నీలోనే వుంది

* *

# 10

అనేక వాంఛలవల్ల స్వప్నం కలుగుతుంది
ఆలోచనవల్ల మనసు కలత చెందక
శాంతంగా వున్నప్పుడూ
నిష్కళంకమైన ప్రేమ పరిపూర్ణతతో
హృదయం పవిత్రంగా వున్నప్పుడూ,
ఓమిత్రమా, అప్పుడు మాత్రమే నువ్వు
మోహాతీతమైన జగత్తును కనుక్కుంటావు

నాట్యమాడే ఆ జగత్తును కాపాడే మూలం
నిశ్శబ్దంగా వుంది
అందులో జీవిత సమైక్యత వుంది

ఆ లోకంలో స్వర్గ-నరకాలు, త్రికాలాలు లేవు.
ఆలోచన వంచనకాని,
క్షీణించిపోతున్న ప్రేమ యొక్క గుసగుసలుకాని లేవు

ఏ అద్వితీయానందంలో మృత్యువు నాట్యం చేయదో
నిర్మల తటాకంలో ప్రతిబింబించే నీడల వలె
ఎక్కడ జీవితం స్పష్టపరచబడివుందో
ఆ లోకాన్ని వెదుకు

ఆ లోకం నీ చుట్టూ వుంది
నువ్వు లేకపోతే అదీ వుండదు

* * *

# 11

అగాధ పర్వత గర్భంలోంచి
వేగంగా ప్రవహించే సెలయేరు ఉద్భవించినట్లు
బాధాకరమైన నా హృదయాంతరాళంలోంచి
ప్రపంచానికి పరిమళాన్నిచ్చే
సంతోషదాయకమైన ప్రేమ ఉద్భవించింది

ఎండ పరచుకున్న లోయలోంచి
నీరు వడిగా ప్రవహించి
ఎంత మాత్రం ఒకచోట నిలకడగా ఏలవక
వరస్సు తర్వాత సరస్సు ప్రవేశించినట్లు
హృదయం నుంచి హృదయానికి
నా ప్రేమ ఇచ్చుకుంటూ పోతుంది

వల్లని గుహాంతరాల లోయలోంచి
నీరు దుఃఖంతో కదులుతున్నట్లు
అల్పమైన కోర్కెలవల్ల కలిగిన ఆనందంతో

నా ప్రేమ క్రమంగా నిరుత్సాహపడింది
ఎత్తైన చెట్ల లోతైన వేళ్ళను పోషించే నీరు,
అతి వడిగా ప్రవహించి, ఆ చెట్లనే కూల్చినట్లు,
నా ప్రేమ నా హృదయానందాన్ని క్రూరంగా చీల్చేస్తుంది

నేను ఏ శిలపై పెరిగానో ఆ శిలవే ధ్వంసం చేశాను
అంతూ అవధీలేని జలరాశితో
నాట్యమాడే మహా సముద్రంలో
బ్రహ్మాండమైన నది కలసిపోయినట్లు,
స్వేచ్ఛాయుతమైన పరిపూర్ణత్వంలో వుంది
నా ప్రేమ

* * *

## 12

ఆరోహించుతు :
కొండల మధ్య ఉరుకుతోంది.
పచ్చని లోయల్లో, పొడవైన నీడలు
అడ్డంగా పడివున్నాయి

నిన్న మొదలు నరికిన చెట్టు మోదునుంచి
పచ్చని చిగుళ్ళను వర్షం పైకి తెచ్చింది
ఎత్తైన కొండరాళ్ళ మధ్యలో
గ్రద్దగూడు కడుతుంది

ప్రతీదీ జీవంతో గొప్పగా వుంది
ఓ నేస్తమా జీవితం ప్రపంచాన్ని నింపుతోంది
నువ్వూ—నేనూ శాశ్వత సంయోగంలో వున్నాం

రాజుల భిక్షుకుల దాహం సమంగా తీర్చి
సంతృప్తిపరచే నీటివలె వుంది, జీవితం
బంగారు పాత్రను రాజుగారూ
బావి దగ్గర విరిగి ముక్కలయ్యే మట్టికుండను
బిచ్చగాడూ ప్రాణప్రదంగా ఎట్టుకుంటారు

ఏకాంతం, ఒంటరితనవు భయం,
అంతమౌతున్న పగటి బాధ,
చెదరిపోతున్న మేఘం దుఃఖం -
జీవితంలో ఇవన్నీ వున్నాయి

తన సౌందర్యాన్ని ప్రకటించేవారు ఎవరూ లేక
ప్రేమ శూన్యమైన జీవితం
ఇంటింటికీ తిరుగుతోంది

పెద్ద నల్లరాతి నుండి సొగసైన విగ్రహాన్ని చెక్కితే,
మనుష్యులు దాన్ని పవిత్రంగా పూజిస్తారు
ఆలయానికి వెళ్ళే దారిలోని రాయిని
ఆ మనుష్యులే నిర్లక్ష్యంగా తొక్కుకుంటూ పోతారు

ఓ మిత్రమా, జీవితం ప్రపంచాన్ని నింపుతోంది
నువ్వూ - నేనూ శాశ్వత సంయోగంలో వున్నాం

  

# 13

నీ కోర్కెను రహస్యంగా వెంబడించేదాన్ని వెదికావా,
నువ్వు ఇంక భ్రాంతిలో బ్రతకనవసరం లేదు

'దుఃఖం' అనే లోయలోంచి నువ్వు నడవకపోతే
"సుఖం" గురించి నువ్వు ఏం తెలుసుకోగలవు?
నీ దాస్యానికి నువ్వు వ్యతిరేకంగా విగ్గరగా అరవక
పోతే,
"స్వేచ్ఛ" గురించి నువ్వు ఏం తెలుసుకోగలవు?

ప్రేమ బంధం నుంచి నువ్వు విముక్తికై వెదకకపోతే,
"ప్రేమ" గురించి నువ్వు ఏం తెలుసుకోగలవు?

నిశ్చల నిశీధిలో పువ్వులు విచ్చుకోవడం నేను చూశాను

*   *   *

# 14

ఉధృతంగా ప్రవహించే యేరును
ఒక్క వర్షపు చినుకు తన పరిపూర్ణతతో ఆపగలదా?
కొండమీది ఒంటరి చెట్టును

ఒక్క వర్షపు చినుకు పోషించగలదా?
వర్షపు చినుకు తాను కిందికి జారిపడేప్పుడు
వరద నీళ్ళవలె మధుర ధ్వనిని పలికించగలదా?
ఒక్క వర్షపు చినుకు తన ఒక్కత్రతో
దప్పిక బాధను తీర్చగలదా?

జీవితంలో అహంభావ అభాసనమును
వెంటాడటం అపివేయ
బానిసత్వపు మార్గాల్లో తిరిగే వారినుంచి
జీవితం తప్పించుకుంటుంది

విభాగమైన ఒంటరితనంలోనే నా బాధ అంతా
జీవితంలో నువ్వూ లేవు నేనూ లేను

* * *

# 15

నేను నామ రహితుణ్ణి
నేను కొండ గాలంత శుభ్రంగా వున్నాను
నాకు ఆశ్రయం లేదు
నేను ప్రవహించే నీటివలె వున్నాను
దేవతలకు వున్నట్లు నాకు ఆలయం లేదు
గంభీరమైన దేవాలయాల నీడల్లో నేను లేను
నాకు పవిత్ర గ్రంథాలు లేవు
సాంప్రదాయానికి నేను బద్ధుణ్ణికాను

ఎత్తైన దైవ పీఠం మీద మండే
పరిమళ ధూపంలో నేను లేను
ఆచార, ఆడంబరాల్లో నేను లేను
చెక్కిన రాతి విగ్రహంలో నేను లేను
శ్రావ్యమైన గొప్ప మంత్రోచ్చారణలో నేను లేను

సిద్ధాంతాలకు నేను బద్ధుడనుకాను
నమ్మకాలతో నేను చెడిపోలేదు
మతాల దాస్యంలో నేను చిక్కుకోలేదు
మతాధిపతుల పవిత్ర వేదనలో నేను లేను
తత్వశాస్త్రాల వలలో నేను చిక్కుకోలేదు
తత్వవేత్తల శక్తివంతమైన తెగలలో నేను లేను

నేను అధముడనూ కాదు అధికుడినూ కాదు
నేను ఆరాధకుణ్ణి ఆరాధ్యుణ్ణి
నేను స్వతంత్రుణ్ణి

తిరుగుతూ తిరుగుతూ
తెరచుకున్న సముద్రాన్ని పిలుస్తూ
నది పాడే పాటే, నా పాట
నేనే జీవితం

*　　　　*

# 16

చక్కని ఒక్క కొమ్మను మాత్రమే ప్రేమించకు
నీ హృదయంలో దాని ప్రతిమనే ప్రతిష్ఠించకు
అది నాశనమౌలుంది

చెట్టంతనీ ప్రేమించు
అప్పుడు అందమైన కొమ్మనూ చిగురాకునీ,
ఎండుటాకునీ, సిగ్గుపడుతున్న మొగ్గనూ
పూర్తిగా విచ్చుకున్న పువ్వునీ
రాలిన పూరేకునీ, నిలువునా నాట్యమాడే చెట్టునీ
సంపూర్ణ ప్రేమతో ప్రకాశించే నీడనీ
-చెట్టంతనీ ప్రేమించగలవు

సంపూర్ణమైన జీవితాన్ని ప్రేమించు
దానికి నాశనం లేదు

* * *

# 17

దుఃఖం త్వరగా మరుగౌతుంది
సుఖం కన్నీళ్ళతో బంధింపబడి వుంటుంది
గత నిట్టూర్పుల లోతైన గాయాల్ని
నిశితంగా పరిశీలించిన వారు తప్ప
మరెవరు జ్ఞాపక ముంచుకోగలరు?

సుఖానుభవంలో దుఃఖం ఒక నీడ
ఆరాటపు పలాయనంలో
కాంక్షయౌవనవంతంగా వుంటుంది
కాంక్ష తన పనుల వేగంతో
ఆనంద మూలస్థానాన్ని బహిర్గతం చేస్తుంది

అసంతృప్తివల్ల కలిగే తీకమకే, బాధ
దుఃఖాన్ని ఆహ్వానించడమే
ఆనందానికి మార్గం
మానవ హృదయమే, జీవిత నిలయం

* * *

# 18

ఆ పాట ఎంత లయబద్ధంగా వుంది!
అనేకమంది ప్రేమతో
గర్భాలయం ఊపిరాడకుండా వుంది
అనేకమంది ఆలోచనలతో
దీపం రెప రెప లాడుతోంది

మండుతున్న కర్పూర పరిమళం గాలిని నింపింది
నిర్లక్ష్యపు అర్చకుడు మంత్రోచ్చారణ చేస్తున్నాడు
అపరిమితమైన ఆరాధనవల్ల
అలసిపోయిన విగ్రహం
కాంతిని వెదజల్లుతూ కదలాలన్నట్లు తోస్తోంది

నిశ్చల నిశ్శబ్దం గాలిని బంధించింది
అనంత హృదయ మధురగీతం
ఆ క్షణంలో నాకు అనుకోని కన్నీళ్ళను
ధారగా రప్పించింది

తనకు తెలియని ప్రసవ వేదన గురించి,
తన రొమ్ముచుట్టూ మూగే పిల్లల నవ్వు గురించి,
యౌవనంలో మరణించిన ప్రియుని గురించి

శూన్యగృహంలోని దుఃఖం గురించీ
నిశ్చల నిశీథిలో ఒంటరితనం గురించి
పుష్పించే భూమి మీద, ఫలించని జీవితం గురించి
ధవళ వస్త్రాలు ధరించిన ఒకామె
తన హృదయేశ్వరునికి విన్నవించుకుంటోంది

ఆమెతో కలసి నేనూ విలపించాను
క్రమంగా ఆమె హృదయం నాదయింది
మర్నాడు పూజించవచ్చుననే
ఆనందపు ఆతృతతో
ఆమె ఆ పవిత్ర ఆలయాన్ని వదలి వెళ్ళిపోయింది
నేను ఆమెను ఎప్పటికీ అనుసరిస్తున్నాను

ఓ ప్రేమా, నువ్వూ-నేనూ కలసి తిరుగుదాం
మనం ఎప్పటికీ విడిపోము

* * *

# 19

నేను మనుష్యుల మంచి-చెడ్డలతో మసిలాను
నా ప్రేమ చివరికి చీకటి దిగంతమైంది
నేను మనుష్యుల నీతి-అవినీతుల్ని తెలుసుకున్నాను
వ్యాకులమైన నా ఆలోచన క్రమంగా క్రూరమైంది.

నేను మనుష్యుల పవిత్రతను, అపవిత్రతను
పంచుకున్నాను
జీవనభారం క్రమంగా అధికమైంది

పరిగెత్తే కోర్కెలను వెంబడించాను
జీవిత ఔన్నత్యం వ్యర్థమైంది

నేను ఇప్పుడు కోర్కెల రహస్య కారణం
తెలుసుకున్నాను

* * *

## 28

నీ హృదయమంతటితో దుఃఖాన్ని ఆహ్వానించు
దానివల్ల కలిగే ఆనందం అనంతంగా వుంటుంది

పెద్ద వర్షాలు పడ్డ తర్వాత సెలయేర్లు పొంగినట్లు
ప్రవహించే సెలయేటి నీటి గల గలల్లో
గులకరాళ్ళు మరొకసారి ఆనందించినట్లు
భయాన్ని కలిగించిన ఒంటరితనపు శూన్యం
జీవనమార్గాల్లో విహరించడంతో భర్తీ చేయబడుతుంది

దుఃఖం జీవితపు ఆర్తికను విశదపరుస్తుంది
ఒంటరితనానికి బలాన్ని ఇస్తుంది
మహాపురుషుల హృదయ కవాటాన్ని తెరుస్తుంది.

దుఃఖాక్రాంతదనే పరిపూర్ణత్వం వాణి
అందు ఆనందించడమే, జీవితసంపూర్ణత్వం

* * *

# 21

ఓ నా ప్రియతమా,
నిన్ను తప్ప నేను ఎవరినీ చూడను
నువ్వు నాలో ఉద్భవించావు
నేనా నీలోనే ఆశ్రయం తీసుకుంటాను

నేను నీ గురించి ఎన్నో గ్రంథాల్లో చదివాను
నీ మాదిరిగా ఇంకా చాలామంది వున్నారనీ,
నీ కోసం ఎన్నో ఆలయాలు కట్టారనీ,
నిన్ను ఆరాధించడానికి ఎన్నో
నిత్య కర్మకలాపాలు వున్నాయనీ,
ఆ గ్రంథాలన్నీ నాకు తెలిపాయి
కాని, ఆ విషయాలన్నీ మనిషి ఆలోచనలకు
గట్టి గూళ్ళు కనుక, వాటితో నాకు
సన్నిహిత సంబంధం లేదు

ఓ నేస్తమా, నీ హృదయాంతరాళంలో
నీ ప్రియాతి ప్రియతముని కొరకు వెదకు
హృదయం నృత్యం చేయడం ఆపినప్పుడు,
దేహం నిర్జీవమౌతుంది

ఓ నా ప్రియతమా,
నిన్ను తప్ప నేను ఎవరినీ చూడను
నువ్వు నాలో ఉద్భవించావు
నేను నీలోనే ఆశ్రయం తీసుకుంటాను

* * *

## 22

నా సోదరుడు మరణించాడు
మేమిద్దరం నిర్మలాకాశంలో
రెండు నక్షత్రాలు మాదిరిగా వుండేవాళ్ళం

అతడు నావలె వుండేవాడు
తీవ్రమైన ఎండ వేడికి కాలిపోయాడు
మృదు పవనాలు, వూగే ఖాదమైన చెట్లు
చల్లని నదులు లెఖ్కలేనన్ని నీడలు,
రకరకాల రంగు రంగుల చిలకలు,
పలకరించుకునే ఎకులూ
ఎక్కడ వున్నాయో

తీవ్రమైన ఎండలో నాట్యమాడే పచ్చని చెట్లకొనలు
బంగారు ఇసుక తిన్నెలు,
నీలమేఘ వర్ణపు సముద్రాలు
ఎక్కడ వున్నాయో

సూర్యాతప్త ప్రదేశాల్లో లేతఎరుపు మట్టినేలలు
బురద నీళ్ళలో పసిరి గక్కుతూ
కనువిందుగా మెరిసే వరిపొలాలూ,
కళ్ళు మిరుమిట్లు గొలిపే కాంతితో మెరిసే
నల్లని నగ్న శరీరధారులు
ఎక్కడ వున్నారో,

అక్కడ
ఆ భూమిమీద
ఒకామె దారిపక్కన తన బిడ్డకు పాలిస్తోంది
ఒక ప్రేయసి అందమైన పువ్వులను
ఆరాధనతో అర్పిస్తోంది
ఆ బాట పక్కనే ఒక ఆలయం వుంది
అది కడు నిశ్శబ్దంగా,
అపారమైన శాంతితో నిండివుంది

అక్కడ నా సోదరుడు మరణించాడు
నేను ఒంటరిగా విలపించాను
నేను ఎక్కడకు వెడితే అక్కడ
అతని కంఠం, సంతోషకరమైన అతని నవ్వూ విన్నాను
నా పక్కనుంచి వెళ్ళే ప్రతి వారిలో,
అతని ముఖం కనుపిస్తుందేమోనని చూశాను
వాళ్ళు నా తమ్ముణ్ణి కలుసుకున్నారేమోనని,
ప్రతి ఒక్కరినీ అడిగేవాడిని
కాని, ఎవరూ నాకు ఓదార్పు ఇవ్వలేదు

నేను ఆరాధించాను
నేను ప్రార్థించాను
కాని, దేవతలూ మౌనంగా వున్నారు
ఇంక నేను విచారించను
ఇంక నేను కలలు కనను
అన్నింటిలో, అంతటా అతన్ని అన్వేషించాను

అతని నివాసానికి రమ్మని ఎన్నో చెట్లు
నన్ను రహస్యంగా పిలవడం విన్నాను

ఓ నా హృదయేశ్వరా,
ఆ తర్వాత నా అన్వేషణలో నిన్ను దర్శించాను
నీ ఒక్కడిలోనే నా సోదరుని ముఖాన్ని చూశాను

ఓ నా శాశ్వత ప్రేమ మూర్తీ
నీ ఒక్కడిలోనే బ్రతికివున్నవారి, మరణించినవారి
అందరి ముఖాలు చూస్తున్నాను

* * *

# 23

మనసు, హృదయం పతనావస్థలో వున్నప్పుడు
పూర్వాచారం చోటు చేసుకుంటుంది
నేను నీకు చెప్తున్నాను విను

దట్టమైన పచ్చని చెట్లకింద,
స్వచ్ఛమైన తటాకాలు మరుగుపడి వున్నట్లు,
రాలిపోయిన ఆలోచనల రాశి కింద
జీవితం కప్పబడి వుంది

గత వేసవి కాలపు దుమ్ముతో
మృదువైన ఆకు బరువెక్కినట్లు,
మరణిస్తోన్న ప్రేమతో జీవితం అలసివుంది

అవినీతి భయంచేత, ఆలోచన్ల - భావాల చుట్టూ
కంచె వేయబడ్డప్పుడు,

ఓ మిత్రమా, అప్పుడు
వెలవెలపోతున్న సంధ్య చీకట్లలో
నువ్వు బంధీవై వున్నావు

బ్రహ్మాండమైన లోయ నీడలో
మృదువైన ఒక ఆకు వాడిపోతూ పడివుంది

* * *

## 24

పుష్పం పరిమళం కలిగి వున్నట్లు
ఓ ప్రపంచమా, నువ్వు నా హృదయంలో వున్నావు

నన్ను నీ హృదయంలో నిలుపుకో!
ఎందుకంటే, అనంతమైన జీవితానందాన్ని,
మోక్షాన్ని నేనే!

భూహృదయంలో మాణిక్యం మరుగుపడివున్నట్లు,
నీ హృదయాంతరాళంలో నేను మరుగుపడి వున్నాను

నువ్వు నన్ను ఎరగకపోయినప్పటికీ
నేను నిన్ను పూర్తిగా ఎరుగుదును
నువ్వు నా గురించి ఆలోచించకపోయినప్పటికీ,
నా ప్రపంచం నీతో నిండివుంది
నీవు నన్ను ప్రేమించకపోయినప్పటికీ,
నువ్వు నా నిశ్చల ప్రేమమూర్తివి
నువ్వు నన్ను దేవాలయాల్లో, చర్చిల్లో, మశీదుల్లో
ఆరాధిస్తున్నప్పటికీ, నేను నీకు అపరిచితుణ్ణి
కాని నువ్వు నా శాశ్వత సహచారివి
ప్రశాంతమైన లోయను పర్వతాలు కాపాడుతున్నట్లు
ఓ ప్రపంచమా నా చేతి నీడతో నిన్ను కప్పుతున్నాను

బీటలు తీసిన భూమిమీద వర్షం పడ్డట్లు,
ఓ ప్రపంచమా నా ప్రేమ సుగంధంతో
నేను వస్తూ వుంటాను

ఓ ప్రపంచమా నువ్వు నాకు స్వాగతం చెప్పేందుకై,
నీ హృదయాన్ని పవిత్రంగా, నిరాడంబరంగా వుంచు
నీ హృదయం వాంఛిస్తున్న ఆ ప్రేమను నేనే!

ఓ ప్రపంచమా నీ మనసును
ప్రశాంతంగా స్వచ్ఛంగా వుంచు
ఆ మనసులోనే నీ అవగాహన వుంటుంది
నీ స్వానుభవ సంపూర్ణత్వమైన
ఆ-నీ అవగాహనే, నేను

ఒకచోటునుంచి, మరోచోటుకు కదిలే నీడల్ని
గమనిస్తో దేవాలయంలోనో, దారి పక్కనో
కూర్చుంటాను నేను

* * *

## 25

వివేకం, మనో ఐశ్వర్యం
ప్రేమ, హృదయ పరిమళం
వేరు వేరు మూసల్లో పోయబడ్డప్పటికీ,
ఆ రెండూ ఒకే పదార్థం

బంగారు నాణానికి ఇరుప్రక్కలా వున్న చిత్రాల్ని
పల్చని లోహపు పొర వేరుచేసినట్లు,
ప్రేమ- వివేకాల మధ్య నున్న సామ్యతన్నే [illegible]
మనసుకీ, హృదయానికీ చెందిన అవగాహన [illegible]

ఓ జీవితమా

ఓ ప్రియతమా నీలోనే శాశ్వత ప్రేమవుంది

నీలోనే శాశ్వత సంకల్పమూ వుంది

*  *  *

## 26

వేడినిచ్చే నిప్పురవ్వ,

బూడిదచేత కప్పబడ్డట్లు

ఓ మిత్రమా, నీకు దారిచూపే కాంతి,

నీ స్వానుభవ ధూళికింద వుంది

*  *  *

## 27

ఓ మిత్రమా, నువ్వు సత్యాన్ని ఖండించలేవు

సత్యం, స్వేచ్ఛగా - అపారంగా - నాశనరహితంగా

అవ్యక్తంగా గాలివలె వుంది.

దానికి నివాసస్థలం, ఆలయం, పూజాపీఠం ఏమీలేదు
ఆరాధకుడు ఎంత పట్టుదలతో వున్నప్పటికీ,
సత్యం, ఏ ఒక్కరి దైవమూ కాదు

మధురమైన మధువును తేనెటీగ
ఏ పువ్వు నుంచి సేకరించిందో నువ్వు చెప్పగలవా ?

ఓ మిత్రమా,
నమ్మకాలను మతోన్మాదులకు
మతాల్ని, సదాచారపరులకు వదలి
సత్యాన్ని స్వానుభవ ధూళినుంచి పోగుజెయ్యి

* * *

## 28

తన హృదయానందానికి కుమ్మరి మట్టిని మలచునట్లు
నీ జీవన వైభవానికి నీ భవిష్యత్తును
అనుగుణంగా ఏర్పాటు చేసుకోగలవా ?

దట్టమైన అడవిలోంచి ఆటవికుడు దారిచేసుకున్నట్లు,
ఈ బాధా సంక్షోభంనుంచి
దుఃఖ విమోచనకూ, శాశ్వతానందానికీ,
నువ్వు ఒక స్పష్టమైన మార్గాన్ని ఏర్పరచుకోగలవా?

ఓ మిత్రమా, బ్రహ్మాండమైన పర్వతాలు
కదిలిపోయే వేగమంచుచేత ఒక క్షణం కప్పబడ్డట్లు
నీ స్వయం సృష్టి అయినఅంధకారంలో నువ్వుదాగివున్నావు
నువ్వు చల్లిన బీజఫలమే, నీకు భారమౌతుంది

ఓ మిత్రమా, సత్కార్మ చేయమని
నన్ను భయపెట్టే మాటలే స్వర్గ-నరకాలు
కాని, స్వర్గ - నరకాలు లేవు
నీ జీవితంలో నీ కర్మ బీజాలే
నీకు ఆశాకుసుమాలుగా పుష్పిస్తాయి

కఠిన శిలనుంచి శిల్పి మానవరూపాల్ని చెక్కినట్లు,
నీ స్వానుభవ శిలనుండి, నీ శాశ్వతానందాన్ని మలచుకో

నీ జీవితమే, ఒక మృత్యువు
మరణమే, పునర్జన్మ
జనన - మరణ వలయంనుంచి
బైట పడినవాడే, సుఖవంతుడు

* * *

# 29

నాట్యమాడుతున్న నీళ్ళ దగ్గరకు పర్వతం దిగివస్తుంది
కానీ దాని శిఖరం నల్లని మేఘంలో మరుగుపడి వుంటుంది

నిన్న మొదలు నరికిన దేవదారుచెట్టు మోడుపైన
నాజూకైన ఒక పువ్వు పూసింది
నా ప్రేమ సారాంశమే, జీవితం
దాని బాటలో మృత్యువు లేదు

* * *

# 30

సంశయం దివ్యమైన లేపనం
అది మంట పుట్టించినా అద్భుతంగా నయంచేస్తుంది

నేను నీకు చెపుతున్నాను
నువ్వు కోర్కెతో నిండి వున్నప్పుడు, సంశయాన్ని
ఆహ్వానించు

ఆలోచనా సమయంలో నీ ఆత్మాశ
ఇతరులను అధిగమించినప్పుడు సంశయాన్ని పిలు
గొప్ప ప్రేమతో నీ హృదయం పరమానందంగావున్నప్పుడు,
సంశయాన్ని మేల్కొల్పు

నేను నీకు చెపుతున్నాను
సంశయం శాశ్వత ప్రేమకు జన్మనిస్తుంది
మనో కల్మషాన్ని కడిగి శుభ్రం చేస్తుంది
కనుక, నీ జీవన సామర్థ్యాన్ని
అవగాహనలో శక్తివంతంగా వుండనియ్యి

నీ హృదయ పరిపూర్ణత కోసం,
నీ మనో విహారంకోసం,
నీ చిక్కుల్ని సంశయం విడదీయనియ్యి
పర్వతాలపైనుంచి వీచే పరిశుభ్రమైన గాలులు
లోయలోని నీడల్ని మేల్కొల్పినట్లు
తృప్తిపడ్డ మానసిక ప్రేమ క్షీణిస్తోవుంటే,
నాట్యమాడేందుకు సంశయాన్ని పిలు

నీ హృదయంలోకి సంశయాన్ని గుడ్డిగా ప్రవేశింపనీయకు

నేను నీకు చెపుతున్నాను
సంశయం విలువైన లేపనం
అది మంట పుట్టించినా గొప్పగా నయం చేస్తుంది

* * *

# 31

ఓ నేస్తమా, నేను చెప్పేది విను

నువ్వు యోగివో, సన్యాసివో, ఆచార్యుడివో
భక్తితో భగవంతుని ఆరాధించే ప్రేమికుడవో,
ఆనందాన్ని అన్వేషించే యాత్రికుడవో,
పుణ్యనదుల్లో స్నానంచేసి
పవిత్ర ఆలయాల్ని దర్శించేవాడివో,
రోజులో అప్పుడప్పుడూ ఆరాధించేవాడివో,
అనేక గ్రంథాలు పఠించేవాడివో,
దేవాలయాలు కట్టించేవాడివో
ఎవరివో నీ కోసం నా ప్రేమ బాధపడుతోంది
ప్రియుని హృదయానికి మార్గం నాకు తెలుసు

వ్యర్థమైన ఈ వేదన,
దీర్ఘమైన ఈ శ్రమ
ఎడతెగని ఈ దుఃఖం
మారుతున్న ఈ ఆహ్లాదం,
మండుతున్న ఈ సంశయం,

ఈ జీవనభారం

ఓ మిత్రమా, ఇవన్నీ అంతమైపోతాయి
నీ కోసం నా ప్రేమ బాధపడుతోంది
ప్రియుని హృదయానికి మార్గం నాకు తెలుసు

నేను ప్రపంచమంతా తిరిగాను
ప్రతిరూపాల్ని ప్రేమించాను
ఆనంద తన్మయత్వంలో మంత్రోచ్చారణ చేశాను
విలువైన వస్త్రాల్ని ధరించాను

గుడి గంటల్ని చెవి ఇచ్చి విన్నాను
బాగా చదివి భారంగా పెరిగాను
నేను అన్వేషించాను
నన్ను నేను పోగొట్టుకున్నానా?

లేదు ఎంతో తెలుసుకున్నాను
నీ కోసం నా ప్రేమ బాధపడుతోంది
ప్రియుని హృదయానికి మార్గం నాకు తెలుసు

ఓ మిత్రమా,
నీకు అసలు సత్యం అవగితమైతే,
ఈ ప్రతిరూపాల్ని ప్రేమిస్తావా?
గుడిగంటల్ని ధూపాల్ని భయాల్ని దేవతల్ని
దూరంగా విసిరి పారెయ్యి
మతనమ్మకాల్ని, తత్వశాస్త్రాల్ని పక్కనపెట్టు.

అవన్నీ దూరంగాపెట్టి, రా!
ప్రియుని హృదయానికి మార్గం నాకు తెలుసు

ఓ మిత్రమా
సహజ యోగమే సర్వోత్తమం
ప్రియుని హృదయానికి అదే మార్గం

* *

## 32

ఓ ప్రియతమా,
రూపం ముసుగులోంచి నేను నిన్నే దర్శిస్తున్నాను

పర్వతాల్లో లోయ వున్నప్పటికీ,
అందరాని ఆ పర్వతాల్ని అందుకోవడం,
లోయకు అసాధ్యం
నక్షత్రాల్ని నా ముందుకు తెచ్చిన చీకటి,
ఎంత చిత్రమైనది!

ఆ చీకటి, పగటినుంచే పుట్టింది

నేను జీవితాన్ని ప్రేమిస్తున్నాను
పర్వతాల్లోని సరస్సు
అనేక సెలయేర్లను తనలోకి తీసుకుని,

మహానదులుగా బైటికి పంపి,
అంతుతెలీని తన అగాధాల్ని నిలుపుకుంటుంది
నా ప్రేమ కూడా అలాగే వుంది

ప్రేమజనితమైన నా యోచన
ఉదయకాల పర్వతాల వలె,
ప్రశాంతంగా, నిర్మలంగా వుంది

జీవిత సామరస్యం తెలుసుకున్నవాడే, సుఖవంతుడు
ఆ తర్వాత అతని జీవితం
శాశ్వతానందంలో సృజనాత్మకంగా వుంటుంది

